# గోవిందము

కొలు గోవిందుం గుమతీ
కొలు గోవిందుం గదిసిన ఘోరాంతమ్మే
లులనల్ గావవు నిన్నిలఁ
గొలు గోవిందున్ సతమ్ము కొలు గోవిందున్ 1.

వలలోఁ జిక్కకు దుడ్డున
కిలఁ గలిగిన దాని తోడ నెలమి వడయుమా
కలుషాత్ముండవు గాకుమ
కొలు గోవిందున్ సతమ్ము కొలు గోవిందున్ 2.

పాలిండ్లు బొడ్డులం గని
లోలుండవు గాకుమ యెదఁ గ్రొవ్వును బొలసం
చాలోచింపుమ తగులం
బేలా వాని పయిఁ గొలువు మిల గోవిందున్ 3.

చంచలము తామరాకున
నుంచిన జల మవ్విధంబ యుండును బ్రతుకుల్
మించిన వ్యాధులు గర్వము
ముంచు నరుల వగపునఁ గొలుముర గోవిందున్ 4.

ఇంపుగ నుందురు బంధులు
సంపాదన పరున కెన్న సరసనఁ బిదపం
గంపించు చుండ ముదిమిం
గొంపను క్షేమం బడుగరు గొలు గోవిందున్ 5.

కాయమున గాలి యుండఁగ
డాయుదురు కుశల మడుఁగ  సడలిన యెడల నా
వాయువు భార్యా మణియున్
డాయ వెఱచును గొలువుమ కడఁగి గోవిందున్ 6.

ధనము నెఱుంగుమ నిత్యం
బనర్థ మని సౌఖ్య ముండ దావంతైనం
దనయుల వల నైనను గ
ల్గును భయ మెల్ల యెడలను గొలుమ గోవిందున్ 7.

బాలుర కాటల రతి స్త్రీ
లోలత్వము యౌవనమ్ములోనం జింతా
లోలురు వృద్ధులు భగవ
ల్లోలురు గన రా రెపుడు గొలుమ గోవిందున్ 8.

సతి యెవ్వతె సుతుఁ డెవ్వం
డతి చిత్రము కాపుర మరయంగన్ నీ వే
గతి నెచట నుండి యరుదెం
చితి చింతింపు కొలువుమ శుచిని గోవిందున్ 9.

కోరిక లణంగు సుజనులఁ
జేరిన మోహ మడఁగును నశింపఁగఁ గోర్కుల్
మూరు స్థిరత మోహ మణఁగఁ
గూరు స్థిరత వలన ముక్తి కొలు గోవిందున్ 10.

ఉడిగిన వయస్సు కామము
జడము లుడుగఁగఁ జెఱువు మఱి సడల ధనము బం
ధుఁడు మాయము తత్వ మడర 11.

విడిమట్టు విడుతురు గొలుమ వెస గోవిందున్

వనజభవు పదము సేరుమ
మన మందు నెఱిఁగి విడువుమ మాయా మయమున్
ధన జన యౌవన గర్వము
గొనకుమ కాలము హరించుఁ గొలు గోవిందున్ 12.

రేలు పవళ్లును ఋతువులు
కాలం బాడుచునె యుండుఁ గలకాలమ్మున్
వే లయ మగు నాయువులే
కూలదె యా శానిలమ్ము గొలు గోవిందున్ 13.

వనితా విత్త నిరతి యే
లను మూఢా నీ నియంత్రులఁ గనవె యిలలో
ఘన సజ్జన సాంగత్య
మ్ము నావ భవ సాగరమ్ము పుడమిని దాఁటన్ 14.

తునిమిన దీసిన జుట్టు
న్నను గాషాయాంబరములు నడపిన నైనం
గనిన జగతి బ్రహ్మమ్మును
గనండు వేషమ్ము లెల్లఁ గడుపుల కొఱకే 15.

ముడుతలు వడినన్ దేహము
సడలిన దంతములు నోటఁ జాలక బలమే
నడచినఁ గఱ్ఱం గైకొని
యుడుగదు ముదుసలికి నాస యొక్కింతైనన్ 16.

గగనమణినిన్ హుతాశను 17.

నిఁ గొలిచి నిసిఁ గాళ్లు ముడిఁచి నెమ్మి న్నిదురిం
చి గడపు వృక్ష నివాసికిఁ
దెగ దాశా పాశమే మదిని బిక్షునకున్

చేసిన దానమ్ములు గం
గా సాగర మజ్జనములు గడఁగిన వ్రతముల్
వాసిగ నేరక జ్ఞానము
వీసము ముక్తినిఁ గనండు వేయి భవములన్ 18.

మందిరములఁ దరు మూలము
లందు ధరించి యజినమ్ము లవనిఁ బరుండం
బొందక భో గాన్యమ్ముల
నందఁడె సుఖ మట్టి మనుజుఁ డత్యధికముగన్ 19.

యోగి యయిన భోగి యయినఁ
దాఁ గూడినఁ గూడ కున్నఁ దగులము లందున్
బాగుగ నేరిన బ్రహ్మము
సాగును ముదమున ముదమున సంతత మతఁడే 20.

చదివిన భగవద్గీతను
సదమల గంగా జలమును స్వల్పము గుడువన్
వదలక కొల్వ మురారిని
విదితం బతనికి యముండు వెఱచుచు నుండున్ 21.

జననమ్ములు మరణమ్ములు
జననీ గర్భశయనములు సాలుం జాలున్
జన దుస్తారము పారము
గన నిది సంసారము దయఁ గావు మురారీ 22.

దారిం బరుండి బొంతను
దూర మొనర్పంగ సుకృత దుష్కృత గతులన్
మూరఁగ మది యోగమ్మున
వారక వెట్టి వలె యోగి వరుఁడు రమించున్ 23.

నీ వెవఁడవు నే నెవ్వఁడ
నే విధి నయ్యె మన రాక యెట నుండి కటా
యీ విశ్వ మొక్క కల యని
నీ వెఱుఁగుమ డెంద మందు నిస్సారమ్మున్ 24.

కలఁ డెద నీలో నాలో
నలినాక్షుఁడు విష్ణువే కనలెదవు నాపై
వలచిన వెస విష్ణుత్వము
కలుగుమ సమ భావ మెందుఁ గమనీయముగన్ 25.

కామము క్రోధము లోభము
వే మోహమును ద్యజియించి వెదకఁగ వలయున్
నీ మది నిను నా జ్ఞానం
బేమి యెఱుఁగ కున్నఁ గాంతువే నరకమ్మున్ 26.

వెయి పేళ్లు గీత పాడ వ
లయు వెన్నుని రూపమును దలంపఁగ వలయున్
నియతి సుజనులం గూడ వ
లయుఁ జేయ వలయు వసుంధరను దానమ్ముల్ 27.

సుత రిపు సఖ బంధు జనుల
రతియుఁ బగయు వలదు నిన్నరయు మందటిలో 28.

సతతమ్ము  భేద భావ
మ్ము తగదు తలఁపంగ డెందమున నీ కెందున్

తరుణీ సుఖమ్ము వొందును
నిరతిన్ రోగములు వొందు నిక్కము తుదకున్
మరణము తథ్య మయినఁ గా
వరమున మానఁ డొనరింపఁ బాపము లిలలో 29.

ఒనరుపు ప్రాణాయామము
మనము నడరి నిగ్రహింపు మంచిగ జపముం
దనరుపు మేకాగ్రతతోఁ
గనుమ క్షరాక్షరములం దగ నిలు సమాధిన్ 30.

గురు చరణమ్ముల భక్తి ద
నరిన నరయఁ గలవు ముక్తి నారాయణు నీ
వరయఁ గలవు హృదయస్థుని
స్థిరముగ నింద్రియముల మదిఁ జెన్నుగ నణఁపన్ 31.

కొలు గోవిందుం గుమతీ
కొలు గోవిందుం దరింప ఘోర భవమ్ముం
గలదే నామస్మరణం
బిల నొక్కటి గాక యితర మెన్నఁగ నెందున్ 32.

ఇది శ్రీ పోచిరాజు కామేశ్వర రావు నామధేయ ప్రణీతం బైన శ్రీమచ్ఛంకర భగవత్పాద విరచిత భజగోవిందమ్ నామ స్తోత్రమున కాంధ్రానువాద కంద మాకందములు.



గ్రంథ కర్తృ దంపతులు

# గోవిందము

వివరములు:

పోచిరాజు కామేశ్వర రావు, M.Tech. (Machine Design)

స్వగ్రామము:

బి. దొడ్డవరము, నగరము మండలము, తూర్పు గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.

ఉద్యోగము:

1. Retd. Senior Manager, Electronics Corporation of India Limited (A Govt. of India Undertaking), Hyderabad.
2. Former Assoc. Professor, Dept. Of Mech. Engg. , M.V.S.R Engineering College Hyderabad.
3. Former Assoc. Professor, Dept. Of Mech. Engg. , Rungta College of Engineering and Technology, Raipur.

నివాసము: H.No. 19, Shiva Residency, Phase 1, Mathpurena, Raipur, Chchattisghar - 492013

Cell. Nos. 8602787525, 9440378434.

స్వీయ రచనలు:

1. రామ చంద్ర శతకము.
2. పోచిరాజ శతకము.
3. పద్మావతీ శ్రీనివాసము (ద్విపద కావ్యము- సప్తాశ్వాసములు).
4. వేంకటేశ్వరా శతకము (అష్టోత్తర శతనామ సంభృతము).
5. శ్రీమదాంధ్ర సుందర కాండ (నిర్వచన వాల్మీకి రామాయణానువాదము, 68 సర్గలు).
6. శ్రీకృష్ణ సూక్తి సుధాకరము (శ్రీమదాంధ్ర భగవద్గీత, శ్లోక క్రమానువాదము).
7. శ్రీమన్నారాయణ శతకము.
8. శ్రీమదాంధ్ర శ్రీమన్నారాయణీయము (100 దశకములు).

9. శ్రీమన్నారాయణ దండక సహిత దేవీ మూర్తి త్రయ స్తోత్ర మాలిక.
10. మాహేశ్వర దండకము.
11. మాయా జాలము (అష్టాదశ శంకలు) ఖండిక.
12. ఉదాహరణ కావ్యము_ దొడ్డవర సోమేశ్వరుఁడు
13. శ్రీమదాంధ్ర రామాయణము.
14. శ్రీ బాల రామాయణము (సంక్షిప్త రామాయణము) (కొనసాగుచున్నది)
15. గోవిందము.